# English Grammar & Usage



## మఱియు ఆంగ్లపద [illegible]


యర్రా సత్యనారాయణ, B.Sc., B.Ed.,

కంకటపాలెం - 522 317. బాపట్ల మండలం.






Phone No. 23037




జనప్రియ పబ్లికేషన్స్

అగ్నికుల క్షత్రియుల వారి వీధి,

గంగానమ్మ పేట, తెనాలి - 522 201.

# ENGLISH GRAMMAR & USAGE

## *Articles & Vocabulary*

By : Yarra Satyanarayana, B.Sc., B.Ed.


| ముద్రణ : | Edition : |
| --- | --- |
| ఏప్రిల్, 1995. | April, 1995. |
| అన్ని హక్కులు : జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-వారివి. | All rights reserved by : Janapriya Publications-Tenali. |
| వెల : రూ॥ 14-00. | Price : Rs. 14-00. |
| ముఖ చిత్రము : వి. ఎస్. ప్రకాష్, విజయవాడ-3. | Cover Design : V.S. Prakash, Vijayawada-3. |
| ముద్రణ : పవన్ ప్రింటర్స్, తెనాలి-1. | Printed at : Pavan Printers, Tenali-1. |
| ముఖచిత్ర ముద్రణ : శ్రీదేవి ప్రింటర్స్, విజయవాడ-1. | Cover Printers : Sri Devi Printers, Vijayawada-1. |

ప్రతులకు : For Copies

Janapriya Publications,
Agnikula Kshatriyula vari Street-II,
Ganganammapet, TENALI-522 201.

# విషయసూచిక (*Contents*)

| విషయము : | పేజి |
|---|---|

PART – 1

# *English Grammar & Usage*

# ARTICLES

## CHAPTER – I

పీఠిక : ఆంగ్లభాషను ప్రపంచ వ్యాప్తముగా దాదాపు అన్ని దేశాలు ఉపయోగించడము వలన సహజముగానే అది ఎన్నో ప్రాదేశికమైన మార్పులకు గుఱవుతూ వచ్చిందన్న విషయాన్ని మనము కాదనలేము. ఎన్నో దేశాలలోని ఉన్నత విద్య నభ్యసిస్తున్న విద్యార్థులకు ఆంగ్లభాష నేర్పడములో విశేష అనుభవము గడించిన ఆంగ్లపండితుడు R.A. Close దృష్టిలో ఇంగ్లీష్ గ్రామర్‌ని సూత్రాల చట్రములో బిగించి, ఊపిరాడకుండా చేయడము సమంజసముగా కన్పించలేదు. కొన్ని సూత్రాలకు చాలా exceptions (మినహాయింపులు) ఉండటము వలన ఇంగ్లీష్ గ్రామర్‌లోని అనేక అంశములు బహుక్లిష్టముగా కన్పిస్తాయని ఆయన ఉద్దేశ్యము. ప్రస్తుతము ఈ పుస్తకములో సమగ్రముగా చర్చించబోవు ARTICLES (A or An, The) ని సూత్రబద్ధముగాను, ఉదాహరణ సహితముగాను వివరించటానికి ప్రయత్నిస్తున్నందున ఈ అంశములో ప్రావీణ్యత సంపాదించటము పాఠకులకు పెద్ద అవరోధము కాబోదని నిస్సందేహముగా చెప్పవచ్చు.

ఆంగ్లభాషలోని Parts of Speech ని ఒకసారి అవలోకన చేసుకుంటే అవి- ఎనిమిది ఉంటాయి. అందులో Adjective అనే అంశము ఒక part of speech అౌతుంది. Adjectives లోని పలు రకాలలో Articles అను అంశము ఒక ప్రత్యేక రకానికి చెందుతుంది. ఐతే కొంతమంది వ్యాకరణవేత్తలు Articles అను అంశాన్ని ఒక ప్రత్యేకమైన Part of Speechగా అనగా 9వ భాషాభాగముగా వర్ణించడము జరిగినది. వారి వర్ణన సమర్థనీయము కాదు.

మనలో చాలామంది Articles ని నిర్లక్ష్యము చేయడము తెలియని విషయమేమీ కాదు. కానీ Articles ని నిర్లక్ష్యము చేయడము వలన Usageలో అనేక గందరగోళాలకు దారితీస్తుంది. కనుక వీలైనంత సమగ్రముగా Articles ని నేర్చుకోవడము వలన ఆంగ్ల భాషలోని మాధుర్యాన్ని మనము కొంతవరకు అనుభవించవచ్చును.

అసలు Articles ఎన్ని? అనే విషయానికొస్తే, అవి- కేవలము మూడంటే మూడే పదాలు. అవి a, an, theలు- ఇందులో a, an లకు అర్థము ఒకటే కావున, ఈ రెంటినీ ఒకే పదముగా భావింపవచ్చును (a or an). The అనే పదము Articles లోని రెండవ పదము. ఇక మనము Articles అను ప్రస్తుత అంశముపై సమగ్రముగా చర్చించడానికి ప్రయత్నిద్దాము.

**A or An :** A లేదా An అను పదమునకు చాలా అర్థాలున్నవి. అవి 1. One ఒక, 2. any ఏదైన, 3. some ఒకానొక, 4. certain ఫలాన, one ఒక, 5. Other వేరొక, 6. another మరొక, 7. any other ఏదైన.

USAGE (ప్రయోగము) :

1. Not KNOWN (ఫలాన అని తెలియకపోవటము) and not specified (నిర్దిష్టముగా చెప్పకపోవటము.)

**Example :** I have never seen an Ostrich. (నేను ఎన్నడునూ ఒక్క ఆస్ట్రిచ్ పక్షిని కూడా చూడలేదు.)

**వివరణ :** పై ఉదాహరణలోని "an" అను పదము Article ఔతుందని మీరు గ్రహించే ఉంటారు. ఈ వాక్యములో an Ostrich అనగా any Ostrich అని అర్థము.

2. Known(తెలుసు), but not yet specified (కాని నిర్దిష్టముగా చెప్పకపోవటము.)

Example : I received a book about Family Planning for my marriage (నా వివాహానికి కుటుంబ నియంత్రణపై వ్రాయబడ్డ ఒక పుస్తకాన్ని అందుకున్నాను.) (a particular one but not specified)

వివరణ : వివాహ సందర్భముగా వధూవరులకు వారి బంధువులు, స్నేహితులు, పరిచితులు మొదలగువారు అనేక కానుకలను బహూకరించడము మనకు తెలిసిన విషయమే. ఆ కానుకలందు ఎన్నో రకములైనవి ఉండవచ్చును. అందులో కుటుంబ నియంత్రణపై వ్రాయబడ్డ అనేక పుస్తకాలలో ఒకటి బహూకరించబడినది.

THE : The అను పదమునకు కూడా చాలా అర్థములున్నవి. అవి: 1. That అది, ఆ 2. those అవి, వారు 3. this ఇది, ఈ 4. these ఇవి, వీరు 5. such ఫలాన 6. the same అదే 7. the other వేరొక.

USAGE (ప్రయోగము) :

Known (తెలుసు), and specified (నిర్దిష్టముగా చెప్పబడినది.)

Eg: (ఉదాహరణ) : My car struck a wall. The mark is still on the wall (నా కారు ఒక గోడకు గుద్దుకొన్నది. 'ఆ' గుర్తు ఇప్పటికీ 'ఆ' గోడ మీద ఉన్నది.) (a particular one and clearly specified)

## ***Introduction*** (పరిచయము)

1. A or An మరియు The అను రెండు Demonstrative Adjectives (ఫలాన అని చూపు విశేషణములు) Eg. : This, these, that, those ని Articles అని అంటారు.

2. Articles ని Determiners (నిర్ధారణ చేయు పదములు) అని కూడ వ్యవహరించవచ్చును.
3. సాధారణముగా ఇవి Nouns (నామవాచకములు) కు ముందు వస్తూ, వానిని వివరించుటకు అనగా ప్రత్యేకించి కనబడుచేలా చేయుటకు ఉపయోగపడతాయి.
4. NOUN PHRASE (నామవాచక నిర్మాణము) : Article+ Noun (or noun equivalent)" ని Noun Phrase అని పిలువ వచ్చును.

Eg (ఉదాహరణ) : an apple, a large number of people

5. కొన్ని సందర్భములందు Noun తో బాటుAdjective (విశేషణము) లేదా Adverb (క్రియావిశేషణము) & Adjective (s) కలసి ఉండవచ్చును.

| Subject కర్త | Verb క్రియ | NOUN PHRASE | | | |
|---|---|---|---|---|---|
| | | Article | Adverb క్రియా విశేషణము | Adjective విశేషణము | Noun నామ వాచకము |
| This | is | a | — | | bag |
| This | is | a | — | big | bag |
| This | is | a | — | big andblue | bag |
| This | is | a | very | big | bag |

6. ప్రతి Noun తో Article రావడానికి, రాక పోవడానికి ఐదు అవకాశములు గలవు. అవి :
   a) No article+Singular noun(ఏకవచన నామవాచకము)- room

Example : This is my room (ఇది నా గది.)

   b) Indefinite article+Singular noun — a room

Example : I have a room (నేనొక గదిని కలిగి యున్నాను.)

c) Definite article + Singular noun — the room

Example : My shirt is in the room (నా షర్ట్ ఆ గదిలో ఉన్నది)

d) No article + plural noun (బహువచన నామవాచకము) — rooms

Example : I have four rooms (నాకు నాలుగు గదులున్నవి.)

e) Definite article + plural noun — the rooms

Example : All the rooms in the Dolphin Hotel are very decent (డాల్ఫిన్ హోటల్‌లోని గదులన్నీ చాలా పరిశుభ్రముగా ఉన్నాయి.)

CHAPTER-2

# *Kinds of Articles*

## (ఆర్టికల్స్‌లో రకములు)

A or An మరియు The అను Articles ని నిర్దిష్టత, అనిర్దిష్టత లను బట్టి రెండు రకములుగా విభజించడము జరిగినది. అవి:

I. Indefinite article : a or an

II. Definite article : The

### I. INDEFINITE ARTICLE :

Introduction (పరిచయము) :

1. A or an ని Indefinite Article అని అంటారు.
2. A or an అను article సాంప్రదాయక ఆంగ్లభాష (Old English) లో ఉన్న one అను Indefinite adjective నకు రూపాంతరమని ఆంగ్లభాషా పండితులు ఊహిస్తున్నారు.

3. Indefinite article ని సాధారణముగా Countable (లెక్కింప దగిన), Singular common noun (ఏకవచన జాతి నామ వాచకము) లకు ముందు ఉపయోగిస్తారు. సాధారణముగా plural noun ముందు ఉపయోగించరు.

4. ఒక ప్రత్యేకమైన వ్యక్తిని లేదా వస్తువును లేదా విషయమును గురించి నిర్దిష్టముగా (నిర్ధారణచేసి, ఫలానా, అని, కచ్చిత ముగా, definiteగా) చెప్పని పదమునకు "Indefinite article" అని పేరు.

5. A or An అను పదమునకు ముఖ్యముగా "one" అను అర్థము వెంటనే స్ఫురించడము సహజము. అనగా ఇది one యొక్క సంక్షిప్తరూపమని భాషా పండితులు భావిస్తున్నారు.

Example : 1. I saw a doctor going (ఒక డాక్టర్ వెళ్ళడము నేను చూశాను.)

(Here a doctor means- some doctor)

వివరణ : అటుగా వెళ్తున్న వ్యక్తిని అతని దుస్తులను, పరికరా లను బట్టి-డాక్టర్‌గా గుర్తించడము జరిగింది. ఆ డాక్టర్‌గారి పేరు గాని, హోదాగాని తెలియక పోవచ్చు లేదా అనవసరము కావచ్చు. ఇలా కచ్చితముగా తెలియని చోట్ల Indefinite article ని వాడ వలెను.

Example : 2. A square has four sides (చదరానికి నాలుగు ప్రక్కలు ఉంటాయి.)

(Here a square means any square)

వివరణ : చదరము (Square) నాలుగు ప్రక్కలను లేదా భుజా లను కలిగియుంటుందని మనకు తెలుసు.ఏ చదరమైననూ నాలుగు ప్రక్కలవే కలిగి యుంటుదని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు. ఇచట ఫలానా చదరమని నిర్దిష్టముగా చెప్పలేదు కాబట్టి Indefinite article ని ఉపయోగించితిమి.

## ముఖ్య ఉపయోగములు (Chief Uses)

1. "One (ఒక)" అని అర్థమును ఇచ్చుటకు a లేదా an అను Indefinite article ని ఉపయోగించుదురు.

**Example-1** : A bird in hand is worth two in the bush (పొదలో రెండు పక్షులుండటము కన్నా చేతిలో ఒకటి ఉండటమే మిన్న)

**Example-2** : A stitch in time saves nine (సరైన సమయములో చిరుగును కుట్టితే ఫలితము తొమ్మిది రెట్లు ఉంటుంది).

2. "Any one" అను భావమును ఇచ్చుటకు కూడా a లేదా an అను Indefinite article ని ఉపయోగించవచ్చును.)

**Examples** : A student should obey his teacher (విద్యార్థి తన ఉపాధ్యాయుని ఎడల విధేయుడై ఉండాలి)

A Cow is a useful animal (ఆవు ఉపయోగపడే జంతువు.)

3. Some one (ఒకడు), certain one (ఫలానా ఒక) లను సూచించుటకు కూడా a లేదా an అను Indefinite article ని ఉపయోగింతురు.

**Examples** : A policeman told us there was a snake (ఒక పోలీస్ అక్కడ ఒక పాము ఉన్నదని మాకు చెప్పినాడు.)

David has a great liking for sport (డేవిడ్‌నకు ఆటలంటే చాలా ఇష్టము.)

### ఉపయోగించు సందర్భములు

1. Countable Singular noun (లెక్కింప వీలైన ఏకవచనములో నున్న నామవాచకము) ముందు హల్లు ధ్వనితో ప్రారంభమయ్యేడి పదముల ముందు "a" అను article ను

అచ్చు ధ్వనితో ప్రారంభ మయ్యేడి పదముల ముందు "an" అను article ని ఉపయోగిస్తారు.

గమనిక : ఇచ్చట ఒక పదమును 'అచ్చు' అని లేదా హల్లు అని నిర్ధారించునపుడు మనము పదము యొక్క Spelling ని గాక ధ్వని (sound) ని మాత్రమే పరిగణనలోనికి తీసుకోవాలన్న విషయాన్ని విస్మరించకూడదు.

Eg : 1. London is a big city (బిగ్ సిటీ)

2. Coffee is a refreshing drink (రిఫ్రెషింగ్ డ్రింక్)

3. Johnson is a University player (యూనివర్శిటీ ప్లేయర్)

4. I want a One rupee note (వన్ రూపీ నోట్)

5. Our village is an hour a way from Madras (అవర్ ఎవే)

6. Pythian is an honourable man (అనర్‌బుల్ మ్యాన్)

7. Mary has an ulcer on her leg (అల్సర్)

8. My brother -in-law is an M. A. (ఎమ్. ఎ.)

9. Nervitol is an efficacious tonic (ఎఫికేషియస్ టానిక్)

10. The Explosive Nitroglycerine is an ester (ఎస్టర్)

అచ్చులను, హల్లులను గుర్తించు విధానము :

ఆంగ్లభాషలో మొత్తము 26 అక్షరములు ఉన్నాయి. అందు 5 అచ్చులు గలవు. అవి A, E, I, O, U, అచ్చులు మినహా మిగిలిన అక్షరములను "హల్లులు (consonants)" అందురు.

అచ్చు (Vowels)లతో ప్రారంభమయ్యేడి పదములు సాధారణముగా అచ్చు ధ్వని (Vowel sound) నే కలిగి ఉంటాయి. హల్లు (Consonants) లతో ప్రారంభమయ్యేడి పదములు హల్లు ధ్వని (consontant sound) నే కలిగి ఉంటాయి.

కానీ కొన్ని పదములు అచ్చులతో ప్రారంభమైననూ హల్లు ధ్వనిని మాత్రమే ఇస్తాయి. అందువలన ఇలాంటి పదముల ముందు 'a' అను Indefinite article ని మాత్రమే ఉపయోగించవలెను. ఉదాహరణలను జాగ్రత్తగా గమనించండి.

Example-1 : A spade is a useful (yuseful) tool (యూజ్‌ఫుల్ టూల్)

Example-2 : Joseph is a University (Yooniversity) student (యూనివర్సిటీ స్టూడెంట్)

మరికొన్ని పదములు హల్లులతో ప్రారంభమైననూ హల్లు అక్షరము Silent (ధ్వని పలుకక పోవడము) కావడము చేత అచ్చు ధ్వనిని మాత్రమే ఇస్తాయి. ఇటువంటి పదముల ముందు "an" అను Indefinite article ని ఉపయోగించవలెను.

Example : an heir (ఎయిర్ = వారసుడు) an honour(అనర్ = గౌరవము)
an hotel (ఒటేల్ = ఫలహారశాల)an hour (అవర్ = గంట)

One (wun) అను పదము అచ్చుఅక్షరముతో ప్రారంభమైననూ హల్లు ధ్వని (consonant sound) నే ఇస్తున్నది.కావున దీనిముందు 'a' అను Indefinite article ని మాత్రమే ఉపయోగించవలెను.

Example : a one hundred rupee note (వన్ హండ్రెడ్ రూపీ నోట్)

దీనిని బట్టి అచ్చులను, హల్లులను గుర్తించవలెనన్న పద ఉచ్చారణ (pronunciation) ను ప్రమాణముగా తీసికొనవలెనని తెలియుచున్నది.

తేలిక పద్ధతి : ఒక పదము ఏ ధ్వనితో ప్రారంభమౌతుందో తెలుసుకోవాలంటే ఆ పదాన్ని ముందుగా తెలుగులో వ్రాసుకోవాలి. ఆ పదము యొక్క ప్రారంభములో తెలుగు భాషలోని అచ్చులైన అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ అను అక్షరములలో ఏదో ఒకటి వస్తే అది అచ్చు ధ్వనితో ప్రారంభమైనట్లుగా గుర్తించవలెను.లేకున్నచో హల్లు ధ్వనితో ప్రారంభమైనట్లుగా గుర్తించవలెను.

**Example-1 : Ceylon is an island** (సిలోన్ ఒక ద్వీపము)

**వివరణ :** పై వాక్యములోని **island** అను పదము ఏ ధ్వని (sound) తో ప్రారంభమైనదో తెలుసుకొని తగు **article** ని ఉపయోగించాలి. ముందుగా ఈ మాటను తెలుగులో వ్రాసుకొని పరిశీలించాలి.

**ఐలండ్ :** 'ఐ' అను అక్షరము తెలుగు భాషలో అచ్చు అక్షరము గనుక **island** అను పదము అచ్చు ధ్వనితో ప్రారంభమైనదని గ్రహించాలి. కనుక ఈ పదము ముందు **Indefinite article** ఐన **"an"** అను పదమును ఉంచాలి.

**Example-2 : Ceylon is a beautiful island** (సిలోన్ ఒక అందమైన ద్వీపము)

**వివరణ :** వాక్యములోని **beautiful** అను పదము ఏ ధ్వని (sound) తో ప్రారంభమైనదో తెలుసుకొని తగు **article** ని ఉపయోగించాలి. ముందుగా ఈ పదమును తెలుగులో వ్రాసుకొని పరిశీలిద్దాము.

**బ్యూటిఫుల్ :** 'బ్యూ' అను అక్షరము తెలుగు భాషలో హల్లు అక్షరము గనుక **beautiful** అను పదము హల్లు ధ్వనితో ప్రారంభ

మైనదని గ్రహించాలి. కనుక ఈ పదము ముందు Indefinite article ఐన 'a' అను అక్షరమును ఉంచాలి.

2. మొదటి సారిగా పరిచయము చేస్తున్న nouns ముందుIndefinite article ని ఉపయోగించాలి.

Example : Once there lived a little boy in a village.
(ఒకానొకప్పుడు ఒక గ్రామములో ఒక చిన్న బాలుడు నివసించేవాడు.)

3. Complement నకు ముందు కొన్ని సందర్భములందు Indefinite article ని ఉపయోగించవలెను. [వాక్యము యొక్క అర్థమును పూర్తి చేయు మాట లేదా మాటలకు complement (పూరకము) అని పేరు.]

Example : Mary is a nurse (మేరి ఒక నర్సు)

గమనిక : ఇచట nurse అను పదము complement గా ఉపయోగించ బడినది.

4. ఒకే లేదా ఒకే రకమైన అను అర్థము నిచ్చుటకు కూడా Indefinite article ని ఉపయోగించుదురు.

Example-1 : Birds of a feather flock together (ఒకే రకమైన పక్షులు ఒక చోట గుమికూడతాయి).

Example-2 : Mothilal Nehru earned money and fame at a time (మోతిలాల్ నెహ్రూ ధనమును, కీర్తిని ఒకే సారి సంపాదించాడు.)

5. జాతి లేదా సమూహములోని ఒక్కరి గురించి మాత్రమే తెలుపుటకు Indefinite article ని ఉపయోగించవచ్చును.

Example-1 : Douban was a Greek doctor (డౌబాన్ అను నతడు ఒక గ్రీక్ డాక్టర్.)

Example-2 : Abdul is an Indian student in Nepal.
(అబ్దుల్ అను నతడు నేపాల్‌లో ఒక భారతీయ విద్యార్థి)

6. ఆశ్చర్యార్థక వాక్యము (Exclamatory or wonder-mark sentence) లోని singular noun నకు ముందు Indefinite article ని ఉపయోగించవలెను.

Example-1 : What a beautiful flower it is ! (ఆహా ! ఇది ఎంత అందమైన పుష్పము!)

Example-2 : What an interesting story! (అహా! ఎంత ఆసక్తి దాయకమైన కథ !)

7. వృత్తి (Occupation) ని సూచించు పేర్లముందు కూడా Indefinite articles ని ఉపయోగించుదురు.

Example-1 : Johnson is an eminent lawyer(జాన్‌సన్ అను నతడు ఒక ప్రసిద్ధి చెందిన న్యాయవాది.)

Example-2 : Alexander is a teacher (అలెగ్జాండర్ అను నతడు ఒక ఉపాధ్యాయుడు.)

8. పిలువబడెడి లేదా వ్యవహరింపబడెడి (to be called) దాని ముందు Indefinite article ని ఉపయోగించవలెను.

Example : It is called a borehole or a well (దీనిని గొట్టపు బావి అనిగాని లేదా నూయి అనిగాని పిలువ వచ్చును.)

9. కొన్ని రకములైన తీవ్ర వ్యాధుల పేర్ల ముందు Indefinite article ని ఉపయోగించవచ్చును. ఐతే రెండు భాగములుగా ఉండెడి ఒకే ఒక అంగమునకు ఈ రూల్ వర్తించదు.

Example-1 : I have got a sorethroat (నాకుగొంతు నొప్పిగా ఉన్నది.

Example-2 : I have a caugh and a head-ache (నాకు దగ్గుగాను, తలనొప్పిగాను ఉన్నది.)

Exception (మినహాయింపు) : I have × kidney trouble
(నాకు మూత్ర పిండముల లోపము ఉన్నది.)

10. Turn అను Linking verb (సంధానము చేయు క్రియ) తర్వాత article ని ఉపయోగించరాదు.

Example : Bhuvana Chandra turned socialist (భువన చంద్ర సోషలిస్ట్‌గా మారినాడు.)

11. ఒక వ్యక్తి యొక్కగాని, ఒక వస్తువు యొక్కగాని గుణమును లేదా రకమును తెలుపుటకు Indefinite article ని ఉపయోగించ వచ్చును.

Examples : Don't make an ass of him.
Don't make me a stupid.

12. ప్రసిద్ధి నొందిన వ్యక్తుల పేర్ల (proper nouns)కు ముందు a లేదా an అను Indefinite article ని ఉపయోగించిన proper nouns గా నున్నవి common noun గా మారి ఆయా వ్యక్తుల గుణములను తెలుపుతాయి.

Example : Saddam Hussain is a real Hitler.
(సద్దామ్ హుస్సేన్ నిజమైన హిట్లర్ వంటివాడు)

వివరణ : క్రూరత్వమునకు హిట్లర్ ప్రసిద్ధి. ఎవరైనా క్రూర స్వభావాన్ని కలిగియున్నచో అతడిని హిట్లర్‌తో పోల్చి చెబుతుంటారు. అందువలన Hitler అను proper noun వెంటనే common noun గా మారి article ని గ్రహిస్తుంది.

13. Material noun (పదార్థ నామవాచకము)ని commonnoun గా ఉపయోగించునపుడు గాని లేదా పదార్థము ఎలాంటిదో తెలియ జెప్పునపుడు article ని ఉపయోగించవలెను.

Examples : 1. Have a glass of fruit juice(ఒక గ్లాస్ పండ్ల రసాన్ని తీసుకోండి)—[వస్తువుగా]

2. Please give me *a* glass of water (దయచేసి ఒక గ్లాస్ మంచినీరు ఇవ్వండి) —[వస్తువుగా]

3. These jars are made of *glass* (ఈ జాడీలు గాజుతో తయారుచేయబడినవి) —[పదార్థముగా]

But 4. This is *a* tough *clay* —[పదార్థముగా]

14. Abstract noun ని common noun గా ఉపయోగించునపుడు article ని ఉపయోగించవలెను.

Examples : 1. *A* knowledge of Physics is as essential as that of Chemistry.

2. Some children suffer from *a* fear of the dark.

15. Speaker (మాట్లాడువ్యక్తి) నకు క్రొత్తవ్యక్తి లేదా ఇంతకు ముందు పరిచయములేని వ్యక్తికి ముందు article ని ఉపయోగించ వచ్చును.

Example : I met *a* Mr. David (ఒక డేవిడ్‌ని కలుసుకున్నాను.)

16. జాతిని సూచించుటకు common noun ముందు articleని ఉపయోగించవలెను.

Example : They are *a* hard-working people.

17. పోల్చకుండా కేవలము ఎక్కువ చేసి చెప్పుటకు మాత్రమే ఉపయోగపడు superlative objective నకు ముందు very అను అర్థము నిచ్చుటకు article ని ఉపయోగించవచ్చును.

Example : Alexander is *a* most remarkable debator of the Oxford University.

18. శాస్త్రవేత్తలు, నిపుణులు, మేధావులు, రచయితలు, శిల్పులు, చిత్రకారులు, కళాకారులు మొదలగువారు రూపొందించిన లేక కనుగొన్న వస్తువులను వారి పేరు మీదుగానే పిలువవచ్చును.

అలాంటి సందర్భములలో ఆయా వస్తువుల లేదా పరికరముల పేర్లను ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు.

Examples : We brought *an* old Ford (car)

They brought *a Picaso* (painting) from London.

19. కొన్ని అలంకారములందు కూడా articleని ఉపయోగించాల్సి ఉంటుంది.

Examples : Here is *a* Paradise for all gamblers.

Bhargavi dances like *a* Menaka (మేనక వలె)

20. వేగము, రేట్, ధరలను సూచించుటకు article ని ఉపయోగించవచ్చును.

Examples : Cheetah can run seventy miles *an* hour.

(చిఱుత గంటకు డెబ్బదిమైళ్ళ వేగముతో పరుగెత్త గలదు.)

Take these Capsules thrice *a* day (రోజుకి మూడు.)

Rice costs four rupees *a* kilogram (కిలో నాలుగు.)

21. సాధారణముగా uncountable nouns తో articleని ఉపయోగించరు- కాని పరిమాణము (Quantity), పద్దు (Item) లను తెలుపు phrases నందు ఉపయోగించవచ్చును.

**Phrase నిర్మాణము :**

సాధారణముగా phrase నిర్మాణములో నాలుగు అంశాలు ఉంటాయి. మొదట Indefinite article ఉంటుంది. చివరలో uncountable (లెక్కింప వీలులేని) noun ఉంటుంది. మధ్యలో పరిమాణము (quantity) ను సూచించు పదము మఱియు 'of' అను preposition ఉంటుంది.

Indefinite article + (Quantity word) of + uncountable noun.

Examples : I want *a cup of coffee.*

A skirt is *an article of clothing.*

ఇలాంటి phrases మరికొన్ని దిగువ నివ్వబడినవి.

a bottle of beer ఒక సీసాడు బీర్

a litre of water ఒక లీటర్ నీరు

a piece of cloth ఒక గుడ్డ ముక్క

a slice of bread ఒక రొట్టె తునక

a wink of sleep ఒక నిద్ర కునుకు లేదా కనుగీటు

22. Not తర్వాత one అను అర్థములో కొన్ని phrases నందు Indefinite article ని ఉపయోగించవచ్చును.

Examples : not *a* leaf on a tree (చెట్టుమీద ఒక ఆకు కూడా లేదు.)

not *a* word (ఒక్క మాట కూడా)

not *a* sign (ఒక్క గుర్తు లేదా చిహ్నము కూడా)

23. ఒకదానిలో (సగము) అని చూపుటకు Indefinite article ని ఉపయోగించవచ్చును.

Examples : half *a* dozen (డజన్ లో సగము)

half *a* mile (మైలు దూరములో సగము)

Ten miles and *a* half (పది మరియు అరమైళ్ళు) లేదా

Ten and *a* half miles (పదిన్నర మైళ్ళు)

24. ఇదే లేదా ఈ రకమే అను అర్థములో Indefinite article ని ఉపయోగించవచ్చును.

Examples : It is *a* film I should verymuch like.

This is *a* book I should very much like.

25. యొక్క లేదా ఒకని అను అర్థములో Indefinite article ని ఉపయోగిస్తారు.

**Example :** Schibsbye is a brother of mine.
(సిబ్స్బై నా యొక్క సోదరుడు)
It is a pen of hers (ఇది ఆమెది).

26. ప్రతి (every) అను అర్థములో Indefinite article ని ఉపయోగిస్తారు.

**Examples :** Alexander gets a salary of Rs. 8000/-a month (అలెగ్జాండర్ ఒక నెలకు 8000 రూ॥ల చొ॥న జీతం సంపాదిస్తున్నాడు.)
Tennis balls cost Rs. 216/- a dozen now. (టెన్నిస్ బంతుల విలువ ప్రతి డజన్ 216 రూపాయలు).

27. కొన్ని సందర్భము లందు such, what అను మాటల తర్వాత Indefinite article ని ఉపయోగిస్తారు.

**Examples :** what a pity ! (ఎంత విచారకరము!)
Such an opportunity should not have been missed (అలాంటి ఒక్క అవకాశాన్ని కూడా పోగొట్టుకోకూడదు).

28. కొద్దిగా లేదా స్వల్పముగా అను అర్థము వచ్చుటకు few, little అను మాటలకు ముందు Indefinite article ని ఉపయోగిస్తారు.

**Example :** There are a few samples, you may have a little more.

గమనిక : Article ని వాడనిచో "అసలులేవు" అను అర్థము వస్తుంది.

29. భోజనము, విందు మొదలగు పదముల ముందు సాధారణముగా article ని ఉపయోగించరు. కానీ adjective తో కూడి వస్తే ఉపయోగించవచ్చును.

Examples : 1. Have you had your food (meal) ?
నీవు భోజనము చేశావా ? [ఇచట articleని ఉపయో గించనవసరము లేదు]

2. I had a heavy break fast in the morning (నేను ఉదయముననే భారీ అల్పాహారాన్ని స్వీక రించాను)

3. Brown gave me a good break fast.
(బ్రౌన్ నాకు చక్కటి అల్పాహారవిందు పెట్టినాడు)

4. We have break fast at 7-15 (మేము 7 గంటల 15 నిమిషాలకు అల్పాహారాన్ని తీసు కొన్నాము)

30. ప్రఖ్యాతి నొందిన వ్యక్తుల కొఱకు ప్రత్యేక భోజనము లేదా విందు ఏర్పాటు చేయు సందర్భములో Indefinite articleని ఉపయోగించుదురు.

Example : We were invited to a dinner given in honour of the president of Bangladesh.
(బంగ్లాదేశ్ అధ్యక్షుని గౌరవార్థము ఇచ్చిన విందుకు మేము ఆహ్వానించబడ్డాము.)

31. A lot of (చాలా), a great many (అత్యధిక), a good many (చాలా అధిక), many a man, many an attempt మొదలగు plural force నిచ్చే phrases నందు Indefinite article ఉంటుంది.

Eg. : 1. Many an attempt has been made (చాలా ప్రయత్నములు జరుపబడినవి)

2. I have a lot of money (నా వద్ద చాలా డబ్బు ఉన్నది.)

3. Madan failed in the examination. He is feeling a lot (మదన్ పరీక్షలలో ఉత్తీర్ణుడు కాలేదు. అతడు చాలా విచారిస్తున్నాడు.)

4. I want a thousand rupees (నాకు వెయ్యి రూపాయలు కావాలి.)

32. సాధారణముగా noun (నామవాచకము) లేదా noun-equivalent (నామవాచకమునకు సమానమైనది) Indefinite article ముందు వస్తుంది. కొన్ని సందర్భములందు adjective (విశేషణము), Noun (నామవాచకము) ల మధ్య కూడా రావచ్చును. ఇలాంటి వాక్యములందు adjective తో బాటు How (ఎట్లు, ఏ విధముగా), so as (అదే విధముగా), too (మరీ) మొదలగు పదములు కూడా రావచ్చును.

Examples : 1. How beautiful a scene is! (ఆ దృశ్యము ఎంత అందముగా ఉన్నదో!)

2. I have never met so sensible a person as he (వాడి లాంటి సున్నితమైన వ్యక్తిని నేనెన్నడూ చూడలేదు.)

3. David is as cunning as a fox (డేవిడ్ అను నతడు నక్క అంతటి మోసగాడు.)

4. He is too kind a man to refuse your help (నీ సహాయము అవసరములేదని తిరస్కరించెడి దయగలవాడు.)

5. She is as dear a friend to me as to you (నీ అంతటి మంచి స్నేహితురాలు ఆమె నాకు.)

33. What అను ప్రశ్నార్థక పదముతో వస్తూ; ఎందుకు? ఏమిటి? ఎవరు? అను ప్రశ్నలు వేయుటలో Indefinite article ఉపయోగ పడుతుంది.

34. పరిమిత అర్థములో Abstract Noun (గుణ నామవాచకము) నకు ముందు Indefinite article ని ఉపయోగించుదురు.

Examples : Mary is a beauty (మేరీ అందగత్తె.)

Netaji Subhash Chandra Bose is a terror to the English (ఇంగ్లీష్ వారికి నేతాజీ సుభాష్ చంద్ర బోస్ అంటే హడలు.)

It is a pity (ఇది చాలా విచారకరమైనది.)

Margaret has a linking for you (మార్గరెట్‌కు నీ వంటే ఇష్టముగా నున్నది.)

CHAPTER - 3

# Definite Article

The అను Definite article ని old English లో- Demonstrative pronoun / adjective ఐన that అను పదమునకు రూపాంతరముగా ఆంగ్ల భాషా పండితులు అభివర్ణించారు.

1. Definite article ఐన The అను పదమునకు దిగువ తెలుపబడిన అర్థములు గలవు.

   The=that- ఆ, అది; those- అవి; this- ఈ, ఇది; these- ఇవి; such- ఆ, అలాంటి; the same- అదే; the other- వేఱొక.

2. Definite article అనేది The అను ఒక్క పదము మాత్రమే!
3. సాధారణముగా The అను definite article ఒక ప్రత్యేకమైన వ్యక్తిని లేదా వస్తువును లేదా విషయమును గుఱించి నిర్ధారణ చేసి చెబుతుంది.
4. దీనిని సాధారణముగా Countable (లెక్కింపదగిన) Common noun (సామాన్య లేదా జాతి నామవాచకము) ముందు ఉపయోగిస్తారు.
5. కొన్ని సందర్భములందు దీనిని Uncountable (లెక్కింపజాలని) noun ముందు కూడా ఉపయోగించవచ్చును.

6. The అను పదమునకు ముఖ్యముగా this, these, that, those అను పదములకున్న అర్థములను అన్వయించి చెప్పుకొన వచ్చును.

Example : Margaret is reading the same book.

(మార్గరెట్ అ పుస్తకాన్నే చదువుచున్నది.)

వివరణ : పైన పేర్కొనబడిన వాక్యమునందు మార్గరెట్ అను బాలిక ఏ పుస్తకాన్ని చదువుచున్నదో స్పష్టముగా తెలియుచున్నది. కనుక కచ్చితత్వమును చూపుటకు Definite article ని ఉపయోగించడము జరిగినది.



Eg. : The people In the street are reading the same pamphlets (వీధిలో నున్న ప్రజలు అవే పాంప్లెట్స్‌ని చదువుచున్నారు.)



## Definite article ని ఉపయోగించు సందర్భములు



1. కచ్చితముగా తెలిసిన లేదా ఇంతకుముందే చెప్పబడిన nouns ముందు అనగా రెండవసారి లేదా తిరిగి చెప్పేడి Nouns ముందు Definite article ని ఉపయోగించవలెను.

Examples : 1. My car struck a wall. The mark is still on the wall (ఆ గుర్తు అనగా కారు గోడకు గుద్దుకొనగా పడిన గుర్తు అని అర్థము.)

2. The pen you had given me was lost. (నీవు ఇచ్చిన కలము పోయినది.)

3. Pass the salt please! (దయచేసి ఆ ఉప్పా గిన్నెను ఇటు ఇవ్వండి.)

4. The pen is in the box. (ఇచట a particular pen is in a particular box అని అర్థము.)

2. సాధారణముగా Superlative degree (అత్యుత్తమ స్థాయి)లో నున్న adjective (విశేషణము) నకు ముందు 'the' అను definite article ని ఉపయోగించాలి.

Examples : 1. Margaret has put on the costliest saree. (మార్గరెట్ అతి విలువైన చీరను ధరించినది.)

2. Calcutta is the largest city in India. (భారతదేశములోని నగరాలలో కలకత్తా అతి పెద్దది.)

3. Generic sense లో ఒక జాతికి ప్రతినిధిగా ఉపయోగించబడిన Singular Noun (ఏకవచన నామవాచకము) ముందు The అను Definite Article ని ఉపయోగించవచ్చును. కానీ ఈ నియమము man, woman అను పదములకు వర్తించదు.

Examples : 1. The tiger is a ferocious animal (పులి ఒక క్రూరమైన జంతువు.)

2. The Jasmine is the sweetest of all flowers. (అన్ని పుష్పాలలోకెల్లా మల్లెపువ్వు[Jasmine] చాలా మధురమైన సువాసన గలది.)

3. The man is mortal.

4. The woman is frail.

4. ఒక భాష (language) పేరు ముందు the అను definite article ని ఉంచిన అది ఆ భాష మాట్లాడు జాతినంతటిని తెలుపుతుంది.

(The English=the British బ్రిటన్ దేశీయులు)

Example : The English defeated the French at Waterloo. (వాటర్లూ యుద్ధములో ఫ్రెంచివారిని ఆంగ్లేయులు జయించారు.)

5. సాధారణముగా ఒక గృహములో వంటగది, బాత్‌రూమ్, పైకప్పు వంటి విభాగాలు ఒక్కొక్కటి చొప్పున మాత్రమే ఉంటాయి. ఇలాంటివాని పేర్లముందు the అను article ఉపయోగించవలెను

Examples : 1. She put that basket on the floor (ఆమె బుట్టను నేలమీద ఉంచినది.)

2. The roof of the house. (ఇంటి పైకప్పు)

3. Now she is in the kitchen (ఆమె ప్రస్తుతము వంటగదిలో ఉన్నది.)

6. దేశరక్షణకు, చట్టపరిరక్షణకు ఉపయోగించెడి దళముల పేర్ల ముందు 'the' అను Definite article ని ఉపయోగిస్తారు.

Examples : 1. The police have not made any arrests. (పోలీసులు ఎవరినీ అరెస్ట్ చేయలేదు.)

మరికొన్ని పదాలు : the Air force, the Army, the Navy, the B.S.F., the N.C.C. మొదలగునవి.

7. ఒకే పేరు గలవారు ఒక సంస్థలో లేదా సంఘములో అనేకమంది ఉన్నప్పుడు తికమక పడకుండా ఉండుటకు Personal name ముందు 'the' అను Definite article ని ఉపయోగిస్తారు.

Example : I want the Dr. Lewis of the University Professors.

8. కుటుంబమును తెలుపుటకుగాను Personal Name ముందు 'The' అను Definite article ని ఉపయోగించుదురు.

Example : I was with the Menons all the morning. (ఉదయమంతా మీనన్ కుటుంబముతోనే గడిపాను.)

9. జాతిని తెలుపు Proper nouns ముందు విధిగా 'the' అను article ని ఉపయోగించవలెను.

Examples : The British, The Chinese, The Dutch, The Swiss.

10. The అను Definite article ని- Proper Noun ముందు గాని, Material Noun ముందుగాని, Abstract Noun ముందుగాని ఉంచిన అవి Common Nounsగా మారుతాయి.

Examples : 1. Kalidas is the Shakespeare of India.
(కాళిదాసు భారతదేశములో షేక్స్పియర్ అంతటివాడు)
2. Where is the tin? (డబ్బా ఎక్కడ ఉన్నది?)
3. The bravery of Sivaji was famous.
(శివాజీ ధైర్యము జగద్విఖ్యాతి చెందినది.)

11. Proper Noun ముందు Adjective ఉన్నపుడు 'the' అను article ని ఉపయోగించవలెను.

Example : The immortal Shakespeare.

12. Collective(సమూహ) అర్థములో జాతిని తెలుపుటకు nouns నకు బదులుగా ఉపయోగించబడే Adjectives నకు ముందు 'the' అను Definite article ని ఉపయోగిస్తారు.

Examples : The rich (= the rich people), The poor (=the poor people), The blind (=the blind people), The dumb (=the dumb people).

13. ఒక జాతికి చెందిన వాటిలో చాలా గొప్పదానిని గురించి చెప్పునపుడు nounకి ముందు "The"ని ఉపయోగిస్తే ఆ Noun నకు Superlative adjective (ఉదా॥ large - larger - largest) కు ఉన్నంత Force (బలము) ఉంటుంది.

Examples : 1. This is the man for job [the most suitable person (బాగా తగినటువంటి వ్యక్తి.)]
2. This is the book on the subject[the best book- (అత్యంత చక్కని పుస్తకము.)]

14. Comparative లోని Adjectives ని adverbs గా మార్చ వలెనన్న "The" అను Definite article ని ఉపయోగించ వలెను.

Example : The more you speak, the less I understand
(ఈ వాక్యములో parallel decreaseని చూడవచ్చు)

15. Comparative degree నందు అనేక వాటిలో ఒక దానిని ఎంచుకొనుట అను అర్థము వచ్చుటకు "The" అను definite article ని ఉపయోగిస్తారు.

Example : David is the tallest of the ten boys.

16. కాలమును తెలుపు phrases నందు "The" అను Definite Article ని ఉపయోగిస్తారు.

Examples : 1. The day after tomorrow (ఎల్లుండి)
2. The day before yesterday (మొన్న)
3. in the morning (ఉదయకాలమునందు)
4. The week after next (తర్వాత వారములో)
5. in the year 1992(1992వ సంవత్సరంలో)
6. on the sixth (6వ తారీఖున)

మినహాయింపు : at × night (రాత్రి సమయమున)
at × 6 O'clock (6 గంటల సమయములో)
on × Friday (శుక్రవారమునాడు)

17. కొన్ని సమయములందు ఋతువుల పేర్లముందు "The" అను Definite article ని ఉపయోగించాలి.

Examples : The winter (చలికాలం)
The spring (వసంత ఋతువు)

18. "Of" తో కూడిన కొన్ని రకముల phrases నందు Definite article (the) ని ఉపయోగించవచ్చును.

Examples : 1. most of the ligislatures (లెజిస్లేచర్స్‌లో చాలామంది)

2. all of the students (విద్యార్థులందరు)

3. many of the boys (బాలురలో చాలామంది)

4. much of the troubles (చాలా కష్టములు లేక ఇబ్బందులు)

5. One sixth of the total population (మొత్తము జనాభాలో 6వ వంతు)

6. A large number of the inhabitants (నివాసికులలో చాలా హెచ్చు మంది)

19. అనేక ముఖ్యమైన Phrasesలో this, that లకు సంబంధించి వటువంటి పనిని "The" అను Definite article చేస్తుంది.

Examples : 1. Tell her I am busy at the moment. (ఈ క్షణములో లేదా ఈ సమయములో నేను బిజీగా ఉన్నానని అమెకు చెప్పుము)

2. I could not remember it at the time. (ఆ సమయములో గుర్తుంచుకోలేదు)

20. యూనివర్సిటీ, కాలేజ్, స్కూల్, చర్చి, టెంపుల్ (దేవాలయము), మాస్క్ (మసీదు), మార్కెట్, హాస్పిటల్, ప్రిజన్ (జైలు), మొదలగువానిని Primary purpose గా ఉపయోగించునపుడు article ఉపయోగించరాదు. కానీ దీనికి వ్యతిరేకమైన Secondary purpose కొఱకు ఉపయోగించవచ్చు. Primary purpose అనగానేమి? ఏ ఉద్దేశ్యము కొఱకు నిర్దే

శింపబడినవో వాటికొఱకు ఉపయోగించుట లేదా ఎక్కడచేయు పనిని అక్కడ చేసినచో అది Primay purpose ఔతుంది.

**Examples :** 1. David and John were sent to prison (శిక్ష కొఱకు)

వివరణ : పై వాక్యములో Primary purpose ఉన్నందున "The" అను Definite article ని ఉపయోగించలేదు.

**I went to the prison to meet the warden.**

వివరణ : పై వాక్యములో Secondary purpose ఉన్నందున Definite article ఉపయోగించబడినది.

2. He went to temple (పూజించుట కొఱకు).
కనుక ఇది Primary purpose లో ఉపయోగించబడి నందున Articleని ఉపయోగించలేదు.

**He went to the temple to talk to the trustee.**

21. Abstract nonn ముందు "the"ని ఉంచిన అది Collective noun గా మాఱి ఆ లక్షణము గలిగిన తరగతి మొత్తాన్ని తెలుపుతుంది.

**Example :** The nobilit, the aristocracy అను Definite article.

22. కొన్ని Common nouns ముందు "the" ని ఉపయోగించిన అవి Abstract noun గా మాఱుతాయి.

**Example :** The beast (Animal nature) in you must perish.

2. Ramesh has something of the patriot (patriotism) in his composition.

23. Superlative అర్థములో ఉపయోగించెడి పదముల ముందు "The" అను Definite ఆర్టికల్‌ను వినియోగించాలి.

Examples : The head master punished me (హెడ్‌మాస్టర్ నన్ను శిక్షించారు)

Who is the Principal of your college? (మీ కాలేజ్ ప్రిన్సిపాల్ ఎవరు?)

The Chief-minister opened the exhibition (ముఖ్యమంత్రి ఎగ్జిబిషన్‌ను ప్రారంభించెను)

The head-sergeant arrived on the scene.

and the Supreme Court.

24. కొన్ని రకాల titles (బిరుదములు) పదవుల (power) ముందు Definite article ని ఉపయోగించాలి.

Examples : 1. Alexander the great.

2. The President of Pakistan.

3. The Foreign Secretary.

25. Ordinal number ముందు కూడా Definite article ని ఉపయోగించవలెను.

Examples : The First, the last, the Sixth, Edward VI (పలుకునపుడు "Edward the Sixth" అని పలికాలి).

7th July (పలుకునపుడు "July the Seventh" అని అనాలి).

| S.No. | విషయము | Definite article తో ప్రయోగాలు | Definite article లేకుండా |
|---|---|---|---|
| 26. | సృష్టిలో ఒకే ఒక్కటిగా ఉన్న వాటి ముందు ఏకత్వము (Uniquity) ను తెలుపుటకు | The Earth, The Sun, The Sky, The moon, The Pluto, The universe. | |
| 27. | భూగోళముపై నున్న భాగములు (Points) | The South pole, the North, the Equator, the weather. | South Bombay (Adjective గా) |
| 28. | ఓడలు (Ships) | The Queen Mary, the Vikranth, The Jala Usha, the May flower, the Sagar Samrat, the Santomeria. | |
| 29. | ఎడారులు (deserts) | The Thar, the Sahara, the Gobi, the Kalahari, the Kizil Kum. | |
| 30. | మైదానములు (plains) | The Indo-Ganegetic plain, The steppes of Central Asia. | Everest, Nanda Devi |
| 31. | పర్వతశ్రేణులు (mountain ranges) | The Rakhies, the Alps, the Satpuras, the Vindhyas, the Aravalli hills. | |

| S.No. | విషయము | Definite article తో ప్రయోగాలు | Definite article లేకుండా |
|---|---|---|---|
| 32. | గోరీలు(monuments) జ్ఞాపకార్థముగా నిర్మించిన కట్టడాలు | The Taj Mahal, the Cenotaph, the Samadhi of Nehru. | |
| 33. | వార్తాపత్రికలు (News papers) | The Sunday Observer, the Tribune, the Mail, the News Chronicle, the Malayala Manorama, the Balarama, the Illustrated Weekly, the Times of India, The Hindu, the Newyork times, the Readers digest, the States man, the Vanita. | Today's Hindu, This Week's Illustrated Weekly Life. |
| 34. | మత గ్రంథములు (Epics) పవిత్ర గ్రంథములు (Sacred books), మరియు ప్రసిద్ధి నొందిన పుస్తకములు. | The Bible, the Ramayana, the Vedas, the Odyssey, the Gitanjali, the Pilgrim's progress, the Pardise lost, the Iliad. | Valmiki's Ramayana, Milton's Paradise Lost, Togore's Gitanjali. |
| 35. | సంగీత వాయిద్యపరికరములు | The Congo organ, the Sitar, the Piano, the Violen, the Veena. | |
| 36. | దుస్తుల పేర్లు | the Shirt. | My shirt, her skirt. |

| S.No | విషయము | Definite article తో ప్రయోగాలు | Definite article లేకుండా |
|---|---|---|---|
| 37. | మహాసముద్రాలు (Oceans) | The Atlantic, the Pacific | |
| 38. | సముద్రాలు (Seas) | The Red sea, the Baltic Sea, the Sea of Japan, the Black Sea the Arabian sea, the Mediterr-nian sea. | |
| 39. | నదులు (Rivers) | The Nile, the Tigris, the Ohio, the Mississipi, the Volga, the Thames, the Ganges. | |
| 40. | కాలువలు (Canals) | The Niel canal, the Suez canal, the Grand canal, the K.C. canal | |
| 41. | సమూహ సరస్సులు (Group of lakes) | The great lakes, the finger-lakes, the Tinland lakes. | Sambar lake, Baikal lake, Lake Superior |
| 42. | అఖాతములు (Bays) | The Bay of Bengal, the Bay of Biscay. | |
| 43. | భూ మరియు జలసంధులు | The Gibralter, the Panama, the gulf of Cambay, the gulf of Kutch, the gulf of Finland, the | |

| S.No | విషయము | Definite article తో ప్రయోగాలు | Definite article లేకుండా |
| --- | --- | --- | --- |
| | | Persian gulf. the gulf of Khambhat, the Srait of Harmuz, the Pak strait. | |
| 44. | దీవుల సమూహములు (Group of Islands) మొ॥వి | The Falkland islands, the Hawaian islands, the West Indies, the Philippines, the Fiji islands, the Orkney islands, the Shetlands, the Indian penisula. | Kirkwall island, Sri Lanka, Tasmania, Coney island, Jawa, Baffin island, Wake island, Luzon, Cyprus, Borneo, East Falkland island, Weddel island. |
| 45. | అడవులు (Forests) | The Nallamalai Forests. | |
| 46. | లైబ్రరీలు (గ్రంథాలయములు) | The Central Library, the Library of Congress, the GLLA Library. | |
| 47. | సంఘములు లేక సమాజములు (Clubs) | The Liom's International, the Rotary Club. | |
| 48. | బహుమతులు, బిరుదులు (Prizes and awards) | The Noble prize, the Kalinga award. | |

| S.No. | విషయము | Definite article తో ప్రయోగాలు | Definite article లేకుండా |
|---|---|---|---|
| 49. | అగ్రములు (Capes) | the Cape of Goodhope. | |
| 50. | రాజకీయ పార్టీలు | The Telugu desam, the Lok Dal, the B.J.P., the Sanjay Vichar Manch, the Republicans, the C.P.I., the Congress (I), the A.I.A.D.M.K., the Janatha Dal. | |
| 51. | ప్రసిద్ధ భవనములు | The Raj Bhavan, the Jai Praja Bhavan, the White house, the Empire State Building. | Buckkingham Palace |
| 52. | గోపురములు (Towers) | The Eiffel Tower, the Porcelain tower. | |
| 53. | మ్యూజియమ్‌లు | The British Museum, the Salar Jung Museum. | |
| 54. | రాజశాసనములు(Charters) | The Pancha Sheela, the Magna Carta, the Bill of Rights, the Indian Govt. Act. of 1935. | |
| 55. | పరిపాలనలు | The Moghal Empire, the Maurya dynasty, the Abbasid dynasty. | |

| S.No. | విషయము | Definite articleతో ప్రయోగాలు | Definite article లేకుండా |
| --- | --- | --- | --- |
| 56. | ముఖ్యమైన సంఘటనలు | The Sepoy mutiny, the Russian Revolution. | |
| 57. | భౌతిక స్థాయిలు (Physical positions) | The Fore, the hind, the opposite, the maximum, the Interior, the side, the outside, the top, the back, the bottom. | |
| 58. | సొరంగములు (Tunnels) | The Hudson tunnel. | |
| 59. | పట్టణములు | The City of Chicago, the Capital of Burma. | Chicago, Burma |
| 60. | కమీషన్లు | The Simon Commission. | |
| 61. | బహువచనంలోనున్న దేశాలు | The Netherlands, the U S.A., the U.S.S.R., the U.A.E. | Canada, Burma |
| 62. | రాష్ట్రములు; వర్ణనతోకూడిన భౌగోళిక ప్రాంతములు | The State of Bihar, the Madhya Pradesh, the Punjab. | Bihar, Kerala |
| 63. | పండుగ సెలవులు | The Pongal Holiday, the Christamas holiday. | Christamas, Dasara |

| S.No. | విషయము | Definite articleతో ప్రయోగాలు | Definite article లేకుండా |
|---|---|---|---|
| 64. | తోటలు | The Brundavan Garden, the Botanical gardens. | |
| 65. | పార్కులు, Zoo లు | The park, the zoo. | Central Park |
| 66. | నియోజక వర్గములు | The Hissar Constituency. | |
| 67. | యూనివర్శిటీలు, కాలేజీలు | The University of Cambridge, the College of Surgeons, the School of Correspondence Course. | Andhra University, Loyola College, City High School |
| 68. | ముఖ్యమైన వీథులు, రోడ్లు | The G.B.C. road, the National Highway, the Oxford Road, the street of the Washerman. | Dalal Street, Devi Chowk Morshead Road, Poornanadam pet. |
| 69. | Isms ముందు | The don't knowism, the Nazism | |
| 70. | రైళ్ళు | The Ganga-Kavery Express, the G.T. Express, the East Coast Express, the Rajadhani Express, the Tirumala Express. | |

| S.No. | విషయము | Definite article తో ప్రయోగాలు | Definite article లేకుండా |
|---|---|---|---|
| 71. | Hotels | The Taj Hotel. | Hotel Sudarshan |
| 72. | Associations, Establishments, Companies etc. | The Y.M.C.A, the Secretariot, the Plantation Corporation of Kerala, the Andhra Cement Company. | |
| 73. | శరీర భాగములు (Limbs of the body) | The hand, the face, the head | her face |
| 74. | Bridges | The Brooklyn Bridge. | |
| 75. | Foundations, Institutions | The Ford Foundation, the boy Scouts. | |

76. Proper noun ని Adjective గా ఉపయోగించునపుడు దాని ముందు article వస్తుంది.

Example : The Bapatla College of Arts and Sciences.

CHAPTER-4

# *Articles* ను ఉపయోగించకూడని సందర్భములు

1. సాధారణ అర్థములో Proper, Material, Abstract, Plural మరియు Uncountable nouns ముందు

Examples : 1. Ottawa is the capital of Canada.
(అట్టావా కెనాడా దేశమునకు రాజధాని)

2. Radium is a costly metal.
(రేడియమ్ చాలా ఖరీదైన లోహము)

3. He was pale with fear. But....Some children suffer from a fear of the dark (the root of penury, the wisdom of Solomon.)

4. Horses are used for riding.
(గుఱ్ఱములను స్వారీ చేయుటకు ఉపయోగింతురు)

5. Milk is good for health.

But... The milk in the small cup is not good.

Please put the milk in the Cup-board.

2. సాధారణ అర్థములో Man, Woman ల ముందు

Examples : Man is mortal, Woman is frail.

3. యొక్క అను అర్థములో nounతో బాటు Pronoun కలిసి ఉన్నపుడు Example : This is my X pencil.

4. Superlative adjective, possessive nounతో కలిసున్నపుడు

Example : A christian home is earth's sweetest picture of Heaven.

5. రవాణాకు ఉపయోగపడు వాహనాల పేర్ల ముందు

Eg : Sripal came by Car; She left for Bombay by Plane.

6. Heaven, Hell, Paradise మొదలగు ఊహాత్మక nounsముందు

Example : God is Heaven.

7. భాషల పేర్ల ముందు

Examples : Telugu, Tamil, Kannada, Bengali, English, Greek, Gujarathi, Hebrew, Latin.

8. ఆటల పేర్ల ముందు

Example : Tennis, Cricket, Hockey, Basket-ball, Base-ball, Foot-ball.

9. వర్ణనతో కూడని దేశములు, రాష్ట్రముల పేర్ల ముందు

Examples : India, China, Burma, Iran
(But... the Congo, the Sudan)
Kerala, Andhra Pradesh (But... the Punjab)

10. ఖండముల పేర్ల ముందు

Example : Namibia is in Africa
(But.... the African elephant)

11. సాధారణ సందర్భములో భోజనము, విందు చేయునపుడు

Eg : Sripal invited me for Supper : I have had break fast.

12. సాధారణ అర్థములో జాతినంతటినీ తెలుపు బహువచనపు Common nouns ముందు

Example : Animals have an undeveloped brain
(here animals means all animals)

13. సంయుక్తముగా ఉండు ఒక యూనిట్‌ను తెలుపునపుడు 2వ దాని ముందు

Example : Give me a cup and saucer

14. పేరుతో బాటు అది ఏమిటో తెలిసినపుడు

Example : Mrs. Gandhi, prime-minister of India

15. ప్రముఖుల పేర్లు, బిరుదులు, పదములతోబాటు వచ్చినపుడు

Examples : President Sadat, General Krishna Rao, Pope Paul II, Mahatma Gandhi, Justice Bhushan, Professor N. G. Ranga, Emperor Asoka, King Birendra, Ltd. General Ershad.

16. కొన్ని భౌగోళిక ప్రాంతముల ముందు

Examples : North America, South Africa, Westernghants.

17. బాగా వాడుకలోనున్న కొన్ని phrases కు ముందు

Examples : 1. Kalpana was in debts. 2. Don't catch fire.
3. RajiniKanth sacrificed his life for love.
4. That presentation is the send word of my friend.
5. This plant is growing speedly day by day.

18. రెండేసి parallel members కలిగిన కొన్ని phrases నందు

Examples : face to face, hand in hand, head to toe, wife and husband, friend and foe, brother and sister, teacher and student, from beginning to end, from first to last.

19. కొన్ని సందర్భాలలో Superlative adjective ముందు

Examples : Her brother was my X greatest friend.
Who has answered X most questions ?

20. God అను పదమునకు ముందు

Example : God knows everything.

21. దగ్గఱ సంబంధమును తెలుపు మాటల ముందు మఱియు cook, nurse మొదలగు వాని ముందు

Examples : 1. Where is cook ?
2. Did you ask nurse to leave ?
3. How is mother ?
4. Aunt wants to see you.
5. I think baby is crying.

22. Possessive nouns ముందు

Example : The moon is earth's satellite.

23. శాస్త్రముల పేర్ల ముందు

Examples : I am studying Zoology.
Gayatri is studying Grammar.

24. పొదుపు (క్లుప్తత) కోసము telegrams, caution boards, lists, head-lines, మఱియు out-lines నందు

Examples : To stop train pull chain, construction in progress, take diversion.

25. రెండు prepositions మధ్య noun వచ్చెడి కొన్ని phrases నందు

Examples : In addition to, in favour of, in spite of, in charge of;(But,for thesake of, with a view to)

26. కొన్ని రకాల phrases నందు

Examples : On earth, at Sunrise, by hand, by name, by night, by mistake, in fact, in office, in silence, in future, in trouble, at last, at home, at fault, all morning, above water

level, below sea level, on foot, on demand, by car (But....in a car), in ink (But .... write with a pen)

CHAPTER-5

# Repetition of the Articles

(ఆర్టికల్స్ యొక్క పునః ప్రయోగములు)

1. ఏవైనా రెండు లేదా అంతకన్నా ఎక్కువ అంశాలు ఒకే nounకు చెందినపుడు మొదటి దానిముందు మాత్రమే articleని వాడాలి.

Example : I have a green and white shirt (ఒకే షర్ట్)

2. అలాకాక దేనికది ప్రత్యేకముగా వివిధ nounsకు చెందితే ప్రతి దాని ముందు article ని వాడాలి.

Examples : I have a green and a white shirt.
(రెండు షర్ట్లు)

They helped a cow, a dog, a fox and a horse in the forest.

3. ఒకే క్రమములో చెప్పు వివిధ అంశాలలో మొదటిది మాత్రమే articles ను స్వీకరిస్తుంది.

Example : The airforce, army and navy.

4. అనేక Singular nouns కు సంబంధించిన మాటను plural లో వ్రాసినపుడు మొదటి noun మాత్రమే article ను స్వీకరిస్తుంది.

Examples : The first, Second and third chapters.

The Old and New Testaments (the old and the new testament)

5. Emphasis (ఒత్తి పలుకుట) కొఱకు ఒకే వ్యక్తికి చెందిన రెండు అంశాల ముందు article ను వాడినపుడు తప్పుగా భావించరాదు.

Examples : This machine is the cheapest and the best.
Churchill was the orator and the statesman of his age.

6. రెండు nouns ఒకదానికే పోల్చు (compare) నపుడు మొదటి దానిముందు article ని వాడాలి.

Example : Suresh was a great soldier than statesman.

7. అలాకాక రెండు nouns ను వేర్వేరు వ్యక్తులకు లేదా వస్తువులకు చెందినట్లుగా పోల్చినపుడు ప్రతి noun ముందు article వస్తుంది.

Example : Moses is a better clerk than an officer.

8. అనేక nouns ను ఒకదాని (విషయము, వ్యక్తి మొ॥నవి) కొఱకే వాడినపుడు అందులో మొదటిది మాత్రమే article ను స్వీకరిస్తుంది.

Example : If this world was that orderly how to accounts for the floods, draughts, earthquakes, fires, epidemics etc. that decimate civilisations.

9. కొన్ని సందర్భాలలో Articles యొక్క అర్థాన్ని కలిగియుండు మరొక పదమును article నకు బదులుగా ఉపయోగించవచ్చును.

Examples : We need a calculator.
We need this/that/her/his calculator.
I want a pen to write.
I want that/this/your pen to write.

గమనిక : ఈ వాక్యములందు 'a' అను article స్థానములో That, this, your, her వంటి పదములు ఉపయోగించబడినవి.

# EXERCISES

## (అభ్యాసములు)

ఈ క్రింది ఖాళీలను తగిన ఆర్టికల్స్ ఉపయోగించి పూరించుము.

A. Fill up the blanks with suitable articles :

1. Nervitol is .... efficatioustonic.
2. Ascaris is .... unisexual.
3. The Explosive Nitroglycerin is .... ester.
4. .... Indian Express delivered once .... day.
5. .... more God's gold is purified in .... furnace of trail .... brighter it shines.
6. .... Andamans are .... group of Islands.
7. Jesus Christ was .... only physician who cured. His patients by taking their diseases.
8. .... Moscow is situated on .... bank of .... Moscova.
9. It was ... very enjoyable picnic lunch.
10. Hymavathi put on .... Commander's .... Uniform.

Key : 1) an 2) a 3) an 4) the, a
5) the, the, the 6) the, a 7) the
8) X, the, the 9) a 10) a, X.

A. Complete the following sentences by using suitable articles :

దిగువ వాక్యాలను తగిన ఆర్టికల్స్ ఉపయోగించి పూర్తిచేయుము.

1. Once .... large number of fish lived in .... pond.

2. Ramesh, you are .... liar and .... thief.
3. .... India became .... Republic on 26th January 1950.
4. .... Bible is a sacred book.
5. Sir, may I ask him .... question?
6. .... Camel is called .... ship of desert.
7. .... public surely have .... right to know what .... government is doing.
8. Life came on this .... earth for .... first time in .... water.
9. God often empties our .... hands in order to fill our .... hearts.
10. .... unread Bible usually belongs to .... unfed believer.

Key : 1) a, a 2) a, a 3) The 4) The 5) a 6) The, the 7) The, a, the 8) X, The, X 9) X, X 10) an, an.

# *PART - II*

# VOCABULARY

## ఆంగ్లపదజాలము

## *1. Contracted Words*

### కుదించబడిన పదములు

ఆధునికకాలములోఫ్యాషన్ కోసముకొన్ని ఆంగ్లపదాలను పొట్టిగా చేసి పిలవడమువలన అసలు పదాలను దాదాపుగా మఱచిపోయామనే చెప్పాలి. సోమరితనము వలన అసలు పదాలను పలకడము మాని, కత్తిరింపు పదాలను ఉపయోగిస్తున్నామని ప్రసిద్ధ ఆంగ్ల భాషా పండితుడు H.G. Fowler విమర్శించాడు. ఈ దురలవాటును Pigmalian నాటకములోని Prof. Higgins పాత్ర ద్వారా ప్రసిద్ధ ఆంగ్లరచయిత "జార్జ్ బెర్నార్డ్‌షా" ఖండించారు. ప్రస్తుతము పాఠకుల సౌకర్యార్థము కొన్ని కత్తిరింపు పదాలను దిగువ నిస్తున్నాము

1. Ads (యాడ్స్) = advertisements [ఎడ్వర్‌టైజ్‌మెంట్స్ = ప్రకటనలు]
2. Bikes (బైక్స్)=bicycles [బైసికిల్స్=ద్విచక్రవాహనములు]
3. Bra (బ్రా) = brassiere [బ్రాసియర్=స్త్రీల లోపలి జాకెట్]
4. Bus (బస్) = omnibus [అమ్నిబస్=పెద్దబండి]
5. Cab (కాబ్) = cabriolet [కాబ్రియోలెట్=గుఱ్ఱపుబండి]
6. Cinema (సినిమా) = cinematograph [సినిమాటోగ్రాఫ్ = చలనచిత్ర దర్శక యంత్రము]
7. Fab (ఫాబ్) = fabulous [ఫేబులస్ = కల్పనమైన]
8. Fan(ఫాన్) fanatic [ఫానటిక్=మూఢభక్తి గలవాడు=ఫాన్]
9. Flu (ఫ్లూ) = influenza [ ఇన్‌ఫ్లూయంజా = జ్వరయుక్తమై అంటు గుణము గల పడిసెము]

10. Hi-Fi (హై-ఫై)=high-fidelity [హై-ఫిడెలిటి = హెచ్చు శ్రద్ధగల] ఉదా: hi-fi-radio=గొప్ప శ్రేష్ఠతగల ఆకాశవాణి.
11. Lino (లినో) = linoteum [లినోటియమ్]
12. Lunch (లంచ్) = luncheon [లంచ్‌యాన్=ఎండవేళ చేయు లఘుభోజనము]
13. Mike (మైక్) = microphone [మైక్రోఫోన్=చిన్న ధ్వనిని పెద్దదిగా చేయు సాధనము]
14. Mob (మాబ్) = mobile volgus [మొబైల్ వల్గస్ = ఇది లాటిన్ పదము. తెలుగులో "అల్లరిచేస్తున్న గుంపు" అని పిలుస్తాము]
15. Mod (మాడ్) = modern [మోడర్న్=నవీనమైన] మాడ్ ఫ్యాషన్స్ = ఆధునిక సొగసులు.
16. Pram (ప్రామ్) = perambulator [పెరంబులేటర్ = పసి పిల్లల "త్రోపుడు బండి" అని తెలుగులో పిలుస్తున్నాము]
17. Perm (పెర్మ్) = permanent wave) [పెర్మనెంట్ వేవ్= బార్బర్ తన షాప్ (సెలూన్)లో జుట్టుకు ఇచ్చే వంపులు]
18. Phone (ఫోన్) = telephone = [టెలిఫోన్=దూరసంవాదక యంత్రము]
19. Photo (ఫొటో) = photograph [ఫొటోగ్రాఫ్=యంత్రము వలన తీయబడిన ఛాయాచిత్రము]
20. Pops (పాప్స్) = popular music [పాపులర్ మ్యూజిక్= జనప్రియమైన సంగీతము]
21. Props (ప్రాప్స్) = properties [ప్రాపర్టీస్=ఆస్తులు]
22. Pub (పబ్)=public house [పబ్లిక్ హౌస్=మద్యపానశాల]
23. Revs(రెవ్స్)=revolutions[రెవల్యూషన్స్=పరివర్తనములు]
24. Smog (స్మాగ్) = smoke and fog [స్మోక్ అండ్ ఫాగ్= తెల్లటి పొగ మంచు]
25. Super (సూపర్)=superlative [సూపర్‌లేటివ్=శ్రేష్ఠమైన]
26. Tec (టెక్=detective [డిటెక్టివ్=నేరస్తులను కనిపెట్టువాడు]
27. Tote (టోట్) = totalisater [టోటలైజేటర్ = కూడికలు తెలుపు యంత్రము]

28. Vet(వెట్)=veterinary [వెటరినరీ=పశువుల సంబంధమైన]
29. Wig (విగ్)=periwig [పెరివిగ్=మాఱువెంట్రుకల కొప్పు]
30. Zoo (జూ)=zoological[జూలాజికల్=జంతుసంబంధమైన]

# 2. Comparisons (పోలికలు)

## -A-

1. As afraid [ఎఫ్రైడ్] (భయపడు) as a grass hopper
   - మిడుత కున్నంత భయము
2. As agile [ఎగైల్] (చుఱుకైన, చులకనైన) as a cat
   - పిల్లి అంత చులకనైన లేదా చుఱుకైన
3. As alert [అలెర్ట్] (చుఱుకుగా) as a chamois
   - కొండ జింకంత చుఱుకైన
4. As ancient [ఏన్షియంట్] (పురాతనమైన) as the Sun
   - సూర్యుడంత పురాతనమైన
5. As awful [అఫుల్] (భయంకరమైన) as thunder
   - పిడుగంత భయంకరమైన
6. As awkward [అక్వార్డ్] (చండాలమైన, అసహ్యమైన) as a pig - పంది అంత చండాలమైన

## -B-

7. As bald [బాల్డ్] (బోడిగా) as an egg - గ్రుడ్డు అంత బోడిగా నుండుట
8. As bare [బేర్] (నగ్నముగా) as a stone - శిల అంత నగ్నముగా నుండుట
9. As big [బిగ్] (పెద్దది) as a whale - తిమింగల మంత పెద్దది
10. As bitter [బిట్టర్] (చేదైన) as gall - పిత్తము అంత చేదైన

11. As black [బ్లాక్] (నలుపు) as coal - బొగ్గంత నల్లనికాలు నలుపు

12. As black [బ్లాక్] (నలుపు) as a crow-కాకి అంత నలుపు కాకి నలుపు

13. As black [బ్లాక్] (నలుపు) as soot - పొగ మసి అంత నలుపు

14. As blind [బ్లైండ్] (గ్రుడ్డిగా) as a bat - గబ్బిలమంత గుడ్డితనము (అంధకారము)

15. As blunt [బ్లంట్] (మొండిగా) as a hammer-సుత్తిఅంత మొండి

16. As bold [బోల్డ్] (ధైర్యము) as a lion - సింహమంత ధైర్యము లేదా సాహసము

17. As boundless [బౌండ్‌లెస్] (హద్దులేని) as the ocean - మహా సముద్రమంత హద్దు లేనిది

18. As bright [బ్రైట్] (కాంతివంతమైన) as day - పట్ట పగలంత కాంతివంతము

19. As bright [బ్రైట్] (కాంతివంతమైన) as noonday - మిట్ట మధ్యాహ్నమంత కాంతివంతము

20. As bright [బ్రైట్] (కాంతివంతమైన) as silver - వెండి అంత ప్రకాశవంతము

21. As brisk [బ్రిస్క్] (చురుకైన) as a flea - మిణ్ణల్లి అంత చురుకైన

22. As brittle [బ్రిటిల్] (పెళుసైన) as glass - గాజు అంత పెళుసైన

23. As brown [బ్రౌన్] (గోధుమ వర్ణము) as a berry - బెర్రి పండంత బ్రౌన్ (గోధుమ వర్ణము) రంగు

24. As brown [బ్రౌన్] ( ,, ) as a bun - రొట్టె అంత గోధుమ వర్ణము

